


AUM.

# MANI RATNAMALA.

BY

## SRI SANKARACHARYA.

[illegible]

1911.




ఓమ్.

శ్రీగురుభ్యోనమః.

శ్రీమజ్జగద్గురు శంకరాచార్య విరచితా

# మణిరత్నమాలా స్తోత్రమ్.

బ్రహ్మశ్రీ నోరి హనుమచ్ఛాస్త్రి గారిచే

నాంధ్ర టీకా తాత్పర్య సహితంబుగ

వ్రాయఁబడి

ఆంగ్లేయభాషాంతరీకరణ సహితంబుగ

(శ్రీరంగావధూత భక్తజన సమాజమువారిచే నంగీకరింపఁబడి)

కందుల వెంకయ్య (గుంటూరు) చేఁ

బ్రకటింపఁబడియె.

మచిలీపట్టణము

సేతు ముద్రాక్షరశాలయందు

సి. సేతుమాధవరావుచే

ముద్రింపఁబడియె.

1911 సం॥ ఏప్రిల్.

 వెల 2 అణాలు. 

# ప్రకటన.

——:o:——

ఆర్యులారా! ఈ మణిరత్నమాల శ్రీమచ్ఛంకరాచార్య భగవత్పాదులవారిచే రచింపఁబడినది. దీనిని ప్రబుద్ధ భారతా పత్రికాధిపతులు ఇంగ్లీషున తర్జుమా చేసియున్నారు. మఱియు హిందిభాషలో పండిత నందలాలకృత వ్యాఖ్యాన సహితముగ ప్రశ్నోత్తరములు వ్రాసియున్నది. కావున నా యుభయగ్రంథముల భేదములను గనిపెట్టి అందు నెవిసరసముగనున్నవో వానిప్రకార మచ్చుటసవరించి వ్రాసితిని. మణిరత్నమాలయనఁగా మణిశ్రేష్ఠములతోఁ గూర్పఁబడిన జపమాలయని యర్థము. దీనియందు ముప్పదిరెండు శ్లోకములుండుటచేత దీనికీపేరు పెట్టఁబడినది. ప్రతిశ్లోకమునకు నాలుగుపాదములచొప్పున లెక్కింపఁగా 128 వింశత్యష్టోత్తర శతమాలయగునని తెలియవచ్చుచున్నది. ప్రతిపాదమందుఁ బ్రశ్నయు నాపాదమందే యుత్తరువును వచ్చునట్లు చెప్పినారు. ఉపనిషత్తులయొక్కయు, వ్యాససూత్రములయొక్కయు, భగవద్గీతలయొక్కయు, మూఁటియందుఁగల ముఖ్యాంశముల నెన్నికచేసి శ్రీశంకరులవారి ముప్పదిరెండు శ్లోకములలో నిమిడ్చి యెల్లవారికి సుబోధమగునట్లు సులభశైలిని వ్రాసియున్నారు. కావున నేను నాబుద్ధికొలఁదిని పెద్దలసహాయముచేత శ్రీశంకరులవారి యభిప్రాయానుగుణ్యముగా వేదాంతరహస్యములు పోల్లుపోకుండఁగ నర్థమును వ్రాసినాఁడను. స్త్రీలకు సంస్కృతభాషరానివారికిని బాగుగాఁదెలియునట్లు నచ్చుటచ్చుట నర్థ

మందు గ్రామ్యపదముల నుపయోగించితిని. అట్టిచోట్ల వ్యాకరణయుక్తమగు పదములనుంచినచో నెల్లవారికిఁ దెలియ వీలుకాదనే యుద్దేశమున నట్లువ్రాసితిని. కాఁబట్టి పండితులయినవారు నన్ను క్షమింప వేఁడుచున్నాను. ముక్తినిగోరు వారికి నిది సులభసాధనమైనదని శ్రీశంకరాచార్యులవారి యభిప్రాయము. నేను అర్థమువ్రాసినపిమ్మట తాత్పర్యము వ్రాసి తెలుఁగువారి యుపయోగార్థము ప్రతిశ్లోకమునకు ప్రశ్నోత్తరములు కలుగునట్లు గీతపద్యములను వ్రాసినాఁడను. శ్లోకములయందుఁగల యెల్లపదములను పద్యములలోవ్రాయకపోయినను శంకరులవారియభిప్రాయము చెడకుండప్రశ్నోత్తరములును వానియందలిముఖ్యాంశములను వదిలిపెట్టలేదు. ఎల్లవారికిది ముఖ్యమైన గ్రంథమనితలంచి దీనిని ముద్రించితిని. పెక్కుచోట్ల నా పొరబాటుననో శక్తిహీనత చేతనో పెక్కు లోపము లుండ వచ్చునని నేను నిక్కముగ నొక్కి.వక్కాణింపఁగలను. కాఁబట్టి పండితులయినవారు వానినెల్లసుగుణములుగానే తలంచి నన్నుమన్నింతురుగాతమని వేఁడుచున్నాను.

ఇట్లు బుధవిధేయుఁడు,

నోరి హనుమచ్ఛాస్త్రి.





శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య వర్య విరచిత

# మణిరత్నమాలా స్తోత్రమ్

శ్రీ గణేశాయనమః

శ్రీ గురుభ్యోనమః



పార సంసారసముద్రమధ్యే
సమ్మజ్జతో మే శరణం కిమస్తి
గురో కృపాలో కృపయా వదైతత్
విశ్వేశ పాదాంబుజ దీర్ఘనౌకా॥ 1.

అర్థము॥ శి॥ కృపాలో = దయకలిగిన గురో = ఓగురూ! అపార సంసార సముద్రమధ్యే=దరిలేని సంసారమను సముద్రపునడుమను, సమ్మజ్జతః=మిక్కిలి మునుగుచున్న, మే=నాకు శరణం=రక్షణకరమైనది, కిమస్తి=ఏదియున్నది? ఏతత్=దీనిని కృపయా=దయతోడను వద=చెప్పుమా! దయకలిగిన ఓగురూ! దరిలేని సంసారసాగరమందు మునుగుచున్న నాకు రక్షణకరమైనది యేదియున్నదో దానిని దయతో నానతీయవలయునని శిష్యుఁడడిగెను. గురు॥ విశ్వేశపాదాంబుజ దీర్ఘనౌకా; విశ్వేశ=సర్వేశ్వరుని యొక్క పాదాంబుజ=పాదకమలములనెడు దీర్ఘ=పెద్దదియగు నౌకా=పడవ, అస్తి=కలదు.

తా॥ సంసార సాగర మధ్యమున మునుఁగుచున్న వానికి సర్వేశ్వరుని పాదకమలములనెడి పెద్ద పడవయే తరింపఁజేయునని గురువు సెలవిచ్చెను.

గీ॥ అంతు లేనట్టి భవవార్ధియందు మునిఁగి
దరిని గనలేని వారికి దారి యేది?
సద్గురూ! చెప్పుమనుచును ఛాత్రుఁడడుగ
దేవదేవుని పదనావ దిక్కనుమ్ము.

## TRANSLATION.

1. Speak, O gracious master (spiritual guide), what can be my refuge,—now as I am about to sink in this endless ocean of Samsara (i. e., the recurrence of birth and death) ? The lotus feet of the Lord of the universe is the great ship to take thee across this ocean, let that be thy refuge !

---

శ్లో॥ బద్ధో హి కో యో విషయానురక్తః
కో వా విముక్తో విషయే విరక్తః
కో వాస్తి ఘోరో నరకః స్వదేహః
తృష్ణాక్షయః స్వర్గపదం కిమస్తి॥ 2.

అర్థము॥ శి॥ బద్ధః= కట్టఁబడినవాఁడు కఃహి=ఎవ్వఁడున్నాఁడు? గు॥ యః=ఎవ్వఁడు విషయానురక్తః=స్రక్చందన విషయములయందు ఆసక్తి కలవాఁడో. (వాఁడేసుమీ) శి॥ విముక్తః=విడిచిపెట్టఁబడినవాఁడు కోవా= ఎవఁడున్నాఁడు? గు॥ విషయే=స్రక్చందనాది విషయములయందు విరక్తః =ఆసక్తిలేనివాఁడె. శి॥ ఘోరః = భయంకరమైన నరక=నరకము

కోవా=ఏది అస్తి=ఉన్నది? గు॥ స్వదేహః=తనదేహాము. (నరకము) శి॥ స్వర్గః=పదం=స్వర్గస్థానము కిమస్తి=ఏదియున్నది? గు॥ తృష్ణాక్షయః=ఆశ విడనాడుటయే.

తా॥ విషయములయం దాసక్తి కలవాఁడె బంధింపఁబడినవాఁడనియు, విషయ విరక్తుఁడు బంధింపఁ బడనివాఁడనియు, స్వశరీరమే నరకమనియు, ఆశాత్యాగమే స్వర్గస్థానమనియుఁ దాత్పర్యము.

గీ॥ బద్ధుఁడెవ్వఁడు? విషయానుబద్ధుఁ డరయ
ముక్తుఁడెవ్వఁడు? విషయ విరక్తుఁడె కద
నరకమెయ్యది? నిజదేహ మరయ వినుము
స్వర్గ పదమెద్ది? తృష్ణాక్షయంబె సుమ్ము.

2. Who are in bondage and who really free? Those who are attached to sense-objects, it is they who are in bondage, and he alone is free whose mind has renounced the world. What is like a dreadful hell?—One's own body. And what is Paradise? The annihilation of all desire for enjoyment.

---

శ్లో॥ సంసారహృత్కః శ్రుతిజాత్మబోధః
కో మోక్షహేతుః ప్రథితః సఏవ
ద్వారంకిమేకం నరకస్య నారీ
కా స్వర్గదా ప్రాణభృతా మహింసా॥ 3.

అర్థము॥ శి॥ సంసారహృత్కః=సంసారబంధ మును నాశింపఁజేయునది యేదియున్నది? ॥గు॥ శ్రుతిజాత్మబోధః=వేదజ్ఞాన జన్యమై

తన్ను దాఁ దెలిసికొనెడు జ్ఞానమే. ॥శి॥ మోక్షహేతుః=మోక్షమునకుఁ గారణమైనది కః=ఏదియున్నది? గు॥ ప్రథితః=ప్రసిద్ధమైన సఏవ=తన్ను తాను తెలిసికొనెడు ఆత్మజ్ఞానమే. శి॥ నరకస్య=నరకమునకు ఏకం=ముఖ్యమైన ద్వారం=మార్గము కిం=ఏది? గు॥ నారీ=ఆఁడుదియే. శి॥ ప్రాణభృతామ్=ప్రాణధారులకు స్వర్గదా=స్వర్గమునిచ్చునది కా=ఏది యున్నది?గు॥ అహింసా=ప్రాణిహింసఁ జేయకుండుటయే. (స్వర్గపుదారి)

తా॥ ఆత్మజ్ఞానము సంసార దుఃఖమును హరించుననియు, నదియే మోక్షహేతువనియు, నాఁడుదానియందు వాంఛ నరకద్వారమనియుఁ, బ్రాణహింసచేయకున్న స్వర్గప్రాప్తి కలుగుననియుఁ దాత్పర్యము.

గీ॥ భవహరం బెద్ది? శ్రుతి జాత్మభావమరయ
మోక్షకారణ మెయ్యది? ముక్తిసుమ్మ
నరక పథమేది విను పింపు?నారి చూవె
యేది దివిదారి? చెప్పగ దే,యహింస.

3. What destroys the chain of births and deaths? The Knowledge of the self, begotten of the Vedas. What then the cause of freedom from all bondages whatever? That very Knowledge of the Self that has been extolled in all the Scriptures. What is the sure gate to hell? To look upon women with a lustful eye. And what leads one as sure to Heaven? Non-injury to all.

---

శ్లో॥ శేతే సుఖం యస్తు సమాధినిష్ఠో
జాగర్తి కో వా సదసద్వివేకీ

కే శత్రవఃసన్తి నిజేంద్రియాణి
తాన్యేవ మిత్రాణి జితాని కాని॥4.

అర్థము॥ శ॥ కస్తు=ఎవ్వఁడు సుఖం=సౌఖ్యముగా శేతే=నిద్రపోవుచున్నాఁడు? గు॥ సమాధినిష్ఠః=సమాధియందు శ్రద్ధవహించినవాఁడె అనఁగా బ్రహ్మమందైక్యము నొందిన వాఁడే సుఖనిద్రపొందుచున్నాఁడు. శ॥ కోవా=ఎవఁడు జాగర్తి=మేలుకొని యున్నవాఁడు? గు॥ సదసద్వివేకీ=మంచి చెడ్డలను జ్ఞానముచే నెఱుఁగువాఁడె. శ॥ కే=ఎవ్వరు శత్రవః=పగవారలు సంతి=ఉన్నారు? గు॥ నిజేంద్రియాణి = తనయొక్క జ్ఞానకర్మేంద్రియములే. శ॥ కాని=ఏవి మిత్రాణి = మిత్రులు? గు॥ జితాని=జయించబడిన తాన్యేవ=ఆ జ్ఞానకర్మేంద్రియములే.

తా॥ సమాధియందైక్యము నొందువాఁడు సుఖముగా నిద్రించుచున్నాఁడనియుఁ, దన యింద్రియములే ప్రబలశత్రువులనియు, నాయింద్రియములు జయింపఁబడినచో నవియే మిత్రులనియుఁ దాత్పర్యము.

గీ॥ మహిని నిద్రితుఁ డెవఁడు? సమాధినిష్ఠుఁ,
డెవఁడు జాగర్తి? సదసద్వివేకి సుమ్ము,
శత్రు లెవరు? నిజేంద్రియ చయమె జగతి
మిత్రు లెవ్వరు? తజ్జితుల్ మేదిని పయి.

4. Who sleeps in peace? He who has attained to the direct perception of his oneness with the Deity in Samadhi or perfect concentration, and attempts to remain in that condition as long as he can. And who is awake? He indeed who can discriminate the Real from the unreal and loves

the Real. Who are enemies of one? One's own organs of sense-perception. Who then are one's real friends? Those very organs when subdued and conquered.

శ్లో॥ కోవా దరిద్రోహి విశాలతృష్ణః
శ్రీమాంశ్చ కో యస్య సమస్తతోషః
జీవన్మృతః కస్తు నిరుద్యమోయః
కావామృతా స్యాత్ సుఖదా నిరాశా॥5.

అర్థము॥ శి॥ కోవా=ఎవఁడు దరిద్రఃహి=మిక్కిలిబీదవాఁడు? గు॥ విశాల తృష్ణః=మిక్కిలి ఆశకలవాఁడు. శి॥ కశ్చ=ఎవ్వఁడు శ్రీమాన్=సంపదకల వాఁడు? గు॥ యస్య=ఎవనికి సమస్తతోషః= అన్నిటియందు సంతోష మున్నదో.(వాఁడు)శి॥కః=ఎవ్వఁడు జీవన్మృతస్తు=బ్రతికియుండియుఁజచ్చిన వానితోసమానుఁడు? గు॥ యః=ఎవఁడు నిరుద్యమః=ప్రయత్నవిహీనుఁడో. శి॥ కావా=ఏది అమృతా=చావులేనిది స్యాత్=అయ్యెను? గు॥ సుఖదా= సౌఖ్యమునిచ్చు నిరాశా=ఆశలేకుండుటయె.

తా॥ అత్యాశ కలవాఁ డెల్లపుడు దరిద్రుఁడనియు, నెల్లప్పు డు నున్నదానితో సంతోషించువాఁడు భాగ్యవంతుఁడనియుఁ, బ్రియ త్నముచేసి పాటు పడనివాఁడు బ్రతికి యుండియుఁ జచ్చిన వానితో సమానుఁడనియు, నాశదిగనాడినవాఁడు అనఁగా వైరాగ్యము కలవాఁడు స్థిరకాలజీవి యనియు, దాత్పర్యము.

ఆ॥ అతిదరిద్రుఁడెవఁడు? యతితృష్ణకలవాఁడె
యెవఁడు భాగ్యశాలి? యెవఁడు తోషి
బ్రతికియుండి మృతుఁడో? యతన విహీనుఁడే
మృతము కానిదేది? మతి నిరాశ.

5. Who really is the poorest of the poor? He whose desires for sense-enjoyment is keen. Who has then really been favoured by fortune? He indeed who is all contentment. Who again is dead while alive? He who is destitute of all diligence and energy. What the nectar that soothes the mortal? Renunciation of all desires whatever.

---

శ్లో॥ పాశోహి కోయో మమతాభిధాన
సన్మోహయత్యేవ సురేవ కా స్త్రీ
కోవా మహాంధో మదనాతురో యో
మృత్యుశ్చ కో వాపయశస్స్వకీయం ॥6.

అర్థము॥ శి॥ కోహి=ఏది పాశః= బంధించెడి గొలుసు? గు॥ యః=ఏది మమతాభిధానః=నాఁ యనెడి మమకారత్వమే. శి॥ కా=ఏది సురేవ= మద్యమువలె సన్మోహయత్యేవ=మిక్కిలిశరీరస్మృతిలేనివానినిగాఁజేయును? గు॥ స్త్రీ=ఆఁడుదియె. (అనగా స్త్రీవాంఛయె.) శి॥ కోవా=ఎవ్వఁడు మహాంధః=మిక్కిలి గ్రుడ్డివాఁడు? గు॥ యః=ఎవ్వఁడు మదనాతురః= మన్మథ వికారయుక్తమైన కామ క్రోధాదులచే పీడింపబడునో. శి॥ కోవా= ఏది మృత్యుశ్చ=మరణాధిదేవత? గు॥స్వకీయం=తనసంబంధమైన అప యశః=అపకీర్తియే.

తా॥ నాది నీదియను మమకారమే తన్ను బంధించునట్టి త్రాళ్లనియును, స్త్రీలయందలి వాంఛయె కల్లువలె శరీరము తెలియకుండఁ జేయునదియనియును, కామ క్రోధాది వికారము కలవాఁడు పుట్టు గ్రుడ్డి వాఁడనియును, నపకీర్తియే తనకు మృత్యుతుల్యమనియుఁ దాత్పర్యము.

ఆ॥ పాశమేది? మమత, పరగ మద్యమువలె
మోహకారియేది? ముద్దుగుమ్మ
అంధుఁడెవఁడు జగతి నగు? మదనాతురుఁ
డరయ మృత్యువేది? యపయశస్సు॥

6. What is the cord that keeps all in bondage? The idea of 'me and mine.' And what maddens one like wine? The idea of possessing a woman. Who indeed is really blind? One who is carried away by lust and passion. What indeed is death? The extinction of one's good name.

---

శ్లో॥ కోవాగురు ర్యోహి హితోపదేష్టా
శిష్యస్తు కోయో గురుభక్త ఏవ
కో దీర్ఘరోగో భవ ఏవసాధో
కిమౌషధం తస్య విచార ఏవ ॥7.

అర్థము॥ శి॥ కోవా=ఎవ్వఁడు గురుః=ఉపాధ్యాయుఁడు? గు॥ యోహి=ఎవ్వఁడు హితోపదేష్టా=మేలు కలిగించుదానిని బోధించువాఁడో వాఁడు. శి॥ శిష్యస్తు=శిష్యుఁడు కః=ఎవ్వఁడు? గు॥ యః=ఎవ్వఁడు గురుభక్త ఏవ= గురునందుభక్తికలవాఁడో.(వాడు) శి॥ కః=ఏది దీర్ఘరోగః=ఎన్నటికి విడువని వ్యాధి? గు॥ హేసాధో=ఓమంచివాఁడా! భవఏవ=ఎడతెగక యెప్పుడు జన్మ మెత్తుచుండుటయె. శి॥ తస్య=ఆ భవరోగమునకు ఔషధం=మందు కిమ్=ఏది? గు॥ విచారఏవ=ఈజన్మము వచ్చుటకు కారణమేదియో దానిని విచారణ చేయుటయే.

తా॥ మేలువాక్యమును బోధించువాఁడు గురువనియును, గురుభక్తి గలవాఁడే శిష్యుఁడనియును, తెంపు లేక జన్మ మెత్తుచుండుటయే విడువని

వ్యాధియనియు, నిత్యానిత్య వస్తువిచారణవల్ల నాజన్మరాహిత్యం జేసికొను టయే యౌషధమనియుఁ దాత్పర్యము.

ఆ॥ గురుఁడెవండు? హితము గూర్చు సదుపదేష్ట
పరఁగ శిష్యుఁడెవఁడు? భక్తియుతుఁడె
దీర్ఘరోగ మేది? తెలుపుము, భవమగు,
తగిన యౌషధంబొ? తత్త్వచింత॥

7. Who is a Guru? He who imparts beneficial teachings. Who is, again, a disciple? He who is devoted to his Guru. What is the disease that protracts the most? The condition of being born and born again is that, Oh aspirant after Truth! And what the remedy for the same? It is the discrimination of what is true and what untrue.

---

శ్లో॥ కింభూషణాద్భూషణమస్తి శీలం
తీర్థం పరం కిం స్వమనో విశుద్ధం
కిమత్ర హేయం కనకంచ కాంతా
శ్రావ్యంసదా కిం గురువేదవాక్యమ్॥8.

అర్థము ॥శి॥ భూషణాత్=అలంకారముకంటెను భూషణమ్=అలంకారము కిమస్తి=ఏదియున్నది? గు॥ శీలం=సత్ప్రవర్తనము శి॥ పరమ్=మిక్కిలి యుత్తమమైన తీర్థమ్=పుణ్యతీర్థము కిం=ఏది? గు॥ విశుద్ధమ్=పరిశుద్ధమైన స్వమనః=తనమనస్సె. శి॥ అత్ర=ఈలోకమందు హేయం=విడచిపెట్ట దగినది కిం=ఏది? గు॥ కనకంచ=ధనమున్ను కాంతా=స్త్రీయును. శి॥ సదా=ఎల్లప్పుడు, శ్రావ్యమ్=వినఁదగినది కిం=ఏది? గు॥ గురువేదవాక్యమ్=గురువుల వల్లను వేదములవల్లను బోధింపఁబడు మాటలను.

తా॥ మంచి ప్రవర్తనయే దొడ్డ యలంకారమనియు, నిర్మలమైన మనస్సేతీర్థమనియు, కాంతా కనక వాంఛలు విడువవలయుననియు, గురువులయొక్క వేదములయొక్క వాక్యములు సర్వదా యనుష్ఠింపవలయుననియుఁ దాత్పర్యము.

ఆ॥ మంచిసొమ్మదేది? మహిలోన శీలమే
మంచి తీర్థమేది? మతి విశుద్ధి
హేయమోది? కాంత, వేయేల కనకంబు
శ్రావ్యమేది? గురుని దివ్యవాక్కు॥

8. What adorns one more than all ornaments ? A good conduct. What is the holiest of all holy places (pilgrimages) ? A pure heart. What are the objects to be shunned in this world ? Wealth and lust. What then is that which is to be cherished most (in the heart)? What you have learnt from the Vedas and from your spiritual guide.

---

శ్లో॥ కేహేతవో బ్రహ్మగతేస్తు సన్తి
సత్సంగతి ర్దాన్తి విచారతోషాః
కేసంతి సంతః కిల వీతరాగా
అపాస్తమోహాః శ్శివతత్వ నిష్ఠాః॥9.

అర్థము॥ శ॥ బ్రహ్మగతేస్తు=బ్రహ్మమును పొందుటకు కేహేతవః=ఏకారణములు సన్తి=ఉన్నవి? గు॥ సత్సంగతిః=సజ్జన సహవాసమున్ను దాన్తిః=ఇంద్రియనిగ్రహమున్ను విచారతోషాః=ఆత్మానాత్మ విచారణయందు సంతోషములును. శ॥ కే=ఏవరు సంతః=సజ్జనులై సంతిః=

ఉన్నారు? గు॥ వీతరాగాః=పోయిన అనురాగముగలవారును, అపాస్తమోహాః= పోయినమోహముగలవారును, శివతత్వనిష్ఠాః=పరశివతత్వమునందు ఆసక్తి కలవారును.

తా॥ బ్రహ్మమును దెలిసి కొనుటకు సజ్జన సహవాసమున్ను, ఇంద్రియనిగ్రహమున్ను, నిత్యానిత్యవస్తు విచారములు నుండవలయుననియు, వీతరాగులయిన వారును, మోహమును విడిచిన వారును, బ్రహ్మతత్వ నిష్ఠ కలవారును, సమస్తమును దెలిసిన పండితులనియుఁ దాత్పర్యము.

ఆ॥ కారణంబు లేవి కలవు బ్రహ్మము జెంద
శాన్తి దాన్తి మఱి విచారమరయ
వీతరాగు లెవరు? విడిచి యజ్ఞానంబు
శివుని తత్వనిష్ఠ చేయువారె॥

9. What are the causes to lead to the realisation of Brahman? The company of the righteous, self-restraint, discrimination and contentment— these alone are conducive to that end. Who are the really virtuous? Those who are void of all attachment to everything unreal, have gone beyond all delusion that the unreal spreads on one's mind, and remain ever steadfast to the Supreme Truth.

---

శ్లో॥ కోవాజ్వరః ప్రాణభృతాంహి చిన్తా
మూర్ఖస్తు కోయస్తు వివేకహీనః
కార్యామయా కా శివవిష్ణు భక్తిః
కింజీవనం దోషవివర్జితం యత్ ॥10.

అర్థము॥ శి॥ ప్రాణభృతాం=ప్రాణధారులకు జ్వరః=తాపముకలిగించు జ్వరము కోవా=ఏదియున్నది? గు॥ చిన్తాహి=విచారమేకదా! శి॥ మూర్ఖస్తు=మూర్ఖుఁడు? గు॥ యస్తు=ఎవ్వఁడైతె వివేకహీనః=నిత్యానిత్యవస్తు వివేక శూన్యుఁడో.(వాఁడు)శి॥ మయా=నాచేత కార్యా=చేయతగినది కా=ఏది? గు॥ శివవిష్ణుభక్తిః= శివకేశవులయందు భక్తియుంటయే. శి॥ జీవనం=బ్రతుకు తెరువు కిం=ఏది? గు॥యత్=ఏపనియైతే దోషవివర్జితమ్=పాపరహితమైనదో? (అది)

తా॥ ప్రాణులకు చిన్తయే జ్వరమనియు, వివేకము లేనివాఁడు మూర్ఖుఁడనియు, ఎల్లప్పుడు శివకేశవుల భక్తి చేయుచుండవలయుననియు, పాపరాహిత్యమైన వృత్తిని జేసి జీవింపవలయుననియుఁ, దాత్పర్యము.

ఆ॥ ప్రథిత జ్వర మదేది? ప్రాణికోటికి చింత
మూర్ఖుఁడో వివేకములను విడువ
చేయఁదగిన దేది? శివకేశవుల భక్తి
జీవనంబో? దోషచింత లేమి.

10. What is the fever that ails all that live? Anxiety. Who is a dunce? Who is devoid of the power of discrimination. What pious acts shall I perform? Keep a devoted love for Shive and Vishnu in your heart. What is indeed life? It is to live and remain free from all wrong-doings.

---:o:---

శ్లో॥ విద్యాహికా బ్రహ్మగతి ప్రదాయా
బోధోస్తికా యస్తు విముక్తి హేతుః

శ్లో॥ లాభ ఆత్మావగమో హి యో వై
జితం జగత్కేన మనో హి యేన॥ 11.

అర్థము॥ శ॥ విద్యాహి=చదువు కా=ఏది? గు॥ యా=ఏవిద్య బ్రహ్మగతిప్రదా=పరమాత్మస్థానమును చేర్చునో, (అది) శ॥ బోధః=జ్ఞానము కః=ఏది అస్తి=ఉన్నది? గు॥ యస్తు=ఏబోధ అయితె విముక్తి హేతుః; విముక్తి=సంసారబంధమునుండి విడుదలపొందుటకు, హేతుః=కారణమైనదో (అది) శ॥ లాభః=లాభమైనది- కః=ఏది? గు॥ యో వై=ఏలాభమైతె ఆత్మావగమోహి=పరబ్రహ్మసాక్షాత్కారము నెఱింగింపుచున్నదో (అది) శ॥ కేన=ఎవని చేత జగత్=లోకము, జితం=జయింపబడినది? గు॥ యేన=ఎవనిచేత, మనః=మనసు జితంహి=జయింపఁబడుచున్నదో.

తా॥ పరబ్రహ్మజ్ఞానమునిచ్చునదే విద్యయనియు, సంసారబంధమునుండి విడుపించునదే బోధయనియును, తన్ను దాఁ దెలిసికొనుటయే లాభమనియు, మనస్సును జయించినచో జగత్తంతయు జయింపఁబడినదనియుఁ, దాత్పర్యము.

ఆ॥ చదువు? బ్రహ్మగతికిఁ జక్క-చేర్చునదేదొ,
బోధయేది? ముక్తి బొందునదియ,
లాభమేది? యాత్మ లాభము నెఱుగుట
జితుఁడొ? యెవఁడు మనసు జేతయగునొ.

**11.** What indeed is true learning? It is that by learning which one sees the way to realise the Brahman or the Truth Absolute. What then is wisdom? It is indeed

that which brings about emancipation from all bondages whatever. What is the greatest of all gains? The realisation of the Atman. Who has conquered the whole world? He who has conquered his own mind.

---

శ్లో॥ శూరాన్మహాశూరతమోస్తి కోవా
మనోజబాణైర్వ్యథితోన యస్తు
ప్రాజ్ఞోతి ధీరశ్చ సమశ్చ కోవా
ప్రాప్తోనమోహం లలనాకటాక్షైః॥ 12.

అర్థము॥ శ॥ శూరాత్ =పరాక్రమవంతునికంటెను మహాశూరతమః=మిక్కిలి శూరాగ్రేసరుఁడు, కోవా=ఎవ్వఁడు అస్తి=ఉన్నాఁడు? గు॥ యస్తు=ఎవఁడైతే, మనోజ బాణైః=మన్మథ బాణములచేతనవ్యథితః = పీడింపఁబడఁడో. శ॥ ప్రాజ్ఞః= తెలిసినవాఁడును, అతిధీరశ్చ=మిక్కిలి ధైర్యశాలియును, సమశ్చ =సర్వమందు సమానబుద్ధికలవాఁడును, కోవా= ఎవ్వఁడు? గు॥యం=ఎవఁడులలనాకటాక్షైః=ఆఁడుదానికడగంటిచూపులచేత మోహమ్=మదనవికారమును నప్రాప్తః = పొందఁబడినవాఁడు కాఁడో. (వాఁడు)

తా॥ మన్మథ బాణపీడితుఁడు కానివాఁడు మిక్కిలి శూరతముఁడనియు, స్త్రీకటాక్షవీక్షణములకు లోఁబడనివాఁడును, తెలిసినవాఁడును, మిక్కిలిధీరుఁడును సర్వసముఁడనియును దాత్పర్యము.

గీ॥ శూరుఁడెవ్వఁడు? మన్మథుబారిఁబడక
ధీరుఁడైయున్నవాఁడె విచారముడిగి,
ధీరుఁడెవ్వఁడు? ప్రాజ్ఞుండు, మీరి స్త్రీల
బారిఁబడకుండనుండెడు బ్రహ్మవేత్త.

12. **Who is the greatest of all heroes? He who has never been troubled by the shafts of Cupid. Who indeed can be called the wise and of great patience and poise? He indeed in whom the eyes of women have never raised the idea of lust.**

---

శ్లో॥ విషాద్విషం కిం విషయా స్సమస్తా
దుఃఖీ సదా కో విషయానురాగీ
ధన్యోఽస్తి కో యస్తు పరోపకారీ
కః పూజనీయో నను తత్త్వనిష్ఠః॥13.

అర్థము॥ శి॥ విషాత్ = విషము కంటెను విషమ్ = ప్రాణహాని చేయునది కిం = ఏది? గు॥ సమస్తా = సమస్తములైన, విషయాః = ప్రాపంచిక వాంఛలే. శి॥ సదా = ఎల్లప్పుడు దుఃఖీ = దుఃఖము కలవాఁడు కః = ఎవ్వఁడు? గు॥ విషయానురాగీ = ప్రాపంచిక విషయములయందు ప్రేమానుబంధముకలవాఁడే. శి॥ కః = ఎవ్వఁడు ధన్యః = కృతార్థుఁడై అస్తి = ఉన్నాఁడు? గు॥ యస్తు = ఎవ్వఁడైతె పరోపకారీ = పరులకు మేలుచేయువాఁడో. (వాఁడు) శి॥ నను = ఓ మహాగురూ! పూజనీయః = పూజింపఁదగినవాఁడు కః = ఎవ్వఁడు? గు॥ తత్త్వనిష్ఠః = యథార్థమందు స్థిరమనస్సు కలవాఁడే.

తా॥ ప్రాపంచిక విషయవాంఛలు విషతుల్యములనియు, అట్టి విషయవాంఛలయందు అనురాగము కలవాఁడు యెల్లప్పుడు దుఃఖియనియు సత్యమందు స్థిరమనసు కలవాఁడు పూజనీయుఁడనియుఁ దాత్పర్యము.

గీ॥ విషము కంటెను విషమేది? విషయవాంఛ
వానికోరెడు వాఁడెపో వసుధ దుఃఖి
పరుల కుపకారి ధన్యుఁడై పరగుచుండు
పూజనీయుఁడో? తత్త్వమ్ము పొందువాఁడె॥

13. What is the most venomous of the venoms? All the sense-objects. Who indeed is ever miserable? He whose heart is ever attached to the pleasures of the senses. Whose life is blessed? His, who does good to others. Who deserves respect of all? He whose mind is firmly fixed in the Truth.

శ్లో॥ సర్వాసు స్వవస్థా స్వపికిం నకార్యం
కింవా విధేయం విదుషా ప్రయత్నాత్
స్నేహాశ్చపాపం పఠనశ్చ ధర్మః
సంసారమూలంహి కిమస్త్య విద్యా॥ 14.

అర్థము॥ శి॥ విదుషా=పండితునిచేత సర్వాసు= సమస్తమైన అవస్థాస్వపి=స్థితులయందునను, కిం=ఏది నకార్యం=చేయగూడదు? కిం=ఏది ప్రయత్నాత్=గొప్ప ప్రయత్నమువలన, విధేయమ్=చేయఁదగినది? గు॥ స్నేహాశ్చ=దారాపుత్రులయందు స్నేహభావమున్ను, పాపం=పాపాచరణమును (ఇవి చేయగూడదు.) పఠనశ్చ=వేదవేదాంగముల పఠనమున్ను ధర్మశ్చ= పుణ్యకర్మల నాచరించుటయు. (ఇవి చేయవలసినవి.) శి॥ సంసారమూలంహి=జనన మరణములకు మొదటి కారణమయినది కిమస్తి=యేదియున్నది? గు॥అవిద్యా=అజ్ఞానమే.

తా॥ జ్ఞానియయినవాఁడు సర్వకాల సర్వావస్థలయందు సంసారవాంఛయును పాపకార్యమును చేయఁగూడదనియును, వేదపారాయణమును ధర్మాచరణమును చేయవలయుననియును, అజ్ఞానమే సంసారమునకు మూలకారణమనియుఁ దాత్పర్యము.

ఆ॥ చేయరానివేవి? స్నేహపాపంబులు
చేయఁదగినవేవి? సిద్ధముగను

వేదపఠనవిధిగ వివిధధర్మంబులు
జగతి భవము కల్గనగు నవిద్య

14. What must a wise man never do in any circumstance, and what again ought he to do with all his might? A wise man must restrain himself from having inordinate attachment and from committing all sins; he should study the scriptures and perform virtuous deeds. What is the root of the world? Avidyâ—ignorance.

---

శ్లో॥ విజ్ఞాన్మహా విజ్ఞతమోస్తి కోవా
నార్యా పిశాచ్యా నచవంచితో యః
కా శృంఖలా ప్రాణ భృతాంచ నారీ
దివ్యం వ్రతం కించ సమస్త దైన్యం॥ 15.

అర్థము॥ శి॥ విజ్ఞాత్ = తెలిసినవానికంటెను విజ్ఞతమః=మిక్కిలి తెలిసినజ్ఞానవంతుఁడు కోవా=ఎవ్వఁడు అస్తి=ఉన్నాఁడు? గు॥ యః=ఏవ్వఁడు నార్యా పిశాచ్యా=స్త్రీయనెడు పయ్యాముచేత నచవంచితః=మోసముచేయబడఁడో. శి॥ ప్రాణభృతాం=దేహధారులకు శృంఖలా=సంకెలి కా=యేది? గు॥ నారీ=ఆడుదియే (సంకెలి) శి॥ దివ్యం=యోగ్యమైన వ్రతమ్=నియమము కించ=యేదియున్నది? గు॥ సమస్తదైన్యం=అందరిలోను తాను తక్కువవాఁడననెడి దీనస్వభావమే॥

తా॥ స్త్రీరూప పిశాచముచేత వంచింపఁబడనివాఁడు మహాజ్ఞాని యనియు, మనుష్యులకు నాడుదియే కాలి సంకెలియనియు, సమస్తమైనవారిలో దీనుఁడనని తలంచుటయే దివ్యమైన వ్రతమనియుఁ దాత్పర్యము.

గీ॥ జ్ఞానవంతులలోనెల్ల జ్ఞానియెవఁడు?
పడఁతియను దయ్యమునకు లోఁబడనివాఁడె,
ప్రాణులకు నేది సంకెలుల్? పడఁతినిజము
ధరణి దివ్య వ్రతంబేది? దైన్యమగును.

**15.** Who is the greatest of all the sages? He who has never been beguiled by the hateful feeling of lustful attraction towards the femal sex. What is the great fetter for a man ? Wife. What is the best of all the vows? The desire to become 'poor in spirit.'

---

శ్లో॥ జ్ఞాతుం నశక్యం హి కిమస్తి సర్వై
ర్యోషిన్మనో యచ్చరితం తదీయం
కా దుస్త్యజా సర్వజనై ర్దురాశా
విద్యావిహీనః పశురస్తి కోవా॥ 16.

అర్థము॥ శ॥ సర్వైః=అందఱిచేత జ్ఞాతుమ్=తెలిసికొనుటకు నశక్యం=శక్యముకానిది కిమస్తి హి=ఏదియున్నది? గు॥ యోషిన్మనః=స్త్రీలమనసు న్ను, తదీయమ్= వారిదియైన యచ్చరితం=వారిప్రవర్తనయున్ను; శ॥ సర్వజనైః=ఎల్లజనులచేత దుస్త్యజా=విడువశక్యముకానిది కా=ఏది? గు॥ దురాశా=చెడ్డదియైన ఆశ్యాశ. శ॥ కోవా=ఎవ్వఁడు పశుః=తెలివిలేని పశువుల్యాఁడయి అస్తి=ఉన్నాడు? గు॥ విద్యావిహీనః=చదువురానివాఁడె.

తా॥ అందరిచేత స్త్రీల మనస్సును వారి ప్రవర్తనయు తెలిసికొనఁబడ నేరదనియు, దురాశ విడువ శక్యముకాదనియు చదువురాని వాఁడుపశువుతో సమానుఁడనియుఁ దాత్పర్యము.

గీ॥ ఏది తెలియనశక్యమౌ నెల్లరకును?
స్త్రీల మనసును చరితంబు వీలుపడదు
విడువశక్యంబు కానిదా విను! దురాశ
విద్య రానట్టివాఁడెపో వెఱ్ఱిపశువు.

16. What is most difficult to be understood by all? The mind of woman and her ways of conduct. What is hard for all persons to relinquish? Ambition or the desire for things which can only be attained with great difficulty. Who is equal to a beast? He who is devoid of knowledge.

---

శ్లో॥ వాసోనసంగః సహకైర్విధేయో
మూర్ఖైశ్చ పాపైశ్చ ఖలైశ్చ నీచైః
ముముక్షుణా కిం త్వరితం విధేయం
సత్సంగతిర్ నిర్మమతేశ భక్తిః॥ 17.

అర్థము॥ శి॥ కైస్సహ=ఎవరితోఁగూడ వాసః=నివసించుటయు, సంగః=సహవాసమున్ను, నవిధేయః=చేయఁగూడదు? గు॥ మూర్ఖైశ్చ=మూర్ఖులతోడను, పాపైశ్చ=పాపాత్ములతోడను, ఖలైశ్చ=దుర్మార్గులతోడను నీచైశ్చ=హీనులతోడను, శి॥ ముముక్షుణా=మోక్షముగోరువాని చేత త్వరితమ్=శీఘ్రముగా కింవిధేయమ్=ఏది చేయఁదగినది? గు॥ సత్సంగతిః=సజ్జన సహవాసమున్ను, నిర్మమతా=మమకార రాహిత్యమున్ను, ఈశభక్తిః=ఈశ్వరభక్తిన్ని.

తా॥ మూర్ఖులతోడను, పాపులతోడను, దుర్మార్గులతోడను, నీచులతోడను, సహవాసము చేయఁగూడదనియును సజ్జన సహవాసమున్ను, మమ

కార రాహిత్యమున్ను ఈశ్వరునియందుభక్తియును సర్వదా చేయవలసిన దనియును తాత్పర్యము.

క॥ ఏరిని కలసి వసించుట
కోరికతో నెవరి చెలిమి కూడదు చెపుమా?
ధారుణి మూర్ఖుల పాపుల
జేరంగనురాదు ఖలుల సిద్ధము జగతిన్॥

గీ॥ మోక్షమును గోరువానిచే మొనసియేది
చేయవలసిన దేదియో? చెప్పుమనఘ!
సజ్జనులతోడి సంగతిసలుపవలయు
నిర్మలత్వము నీశుపై నెమ్మిభక్తి॥

17. With whom one ought not to live or keep company? With the ignorant, the sinful, the mean and those who cannot bear the sight of good of others. What should be resorted to immediately by those who want to be free from all bondages (Moksha) ? Good company, non-attachment, and devotion to the lord of the universe.

---

శ్లో॥ లఘుత్వమూలంచ కిమర్థితైవ
గురుత్వమూలం యదయాచనంచ
జాతాస్తికోయస్య పునర్నజన్మ
కోవా మృతా యస్య పునర్నమృత్యుః॥ 18.

అర్థము॥ శి॥ లఘుత్వమూలంచ=చులకదన కారణము కిం=ఏది? గు॥ అర్థితైవ=ఒకరినియాచించుటయే. శి॥ గురుత్వమూలం=గొప్పవచ్చుటకు

కారణము యత్=యేది? గు॥ యత్ అయాచనంచ=ఏదియైనను ఒకరినియా చించక పోవుటయె. శి॥ జాతః=వీఁడుఁ పుట్టినాఁడు అనిచెప్పతగినవాఁడు కః=యెవ్వడు అస్తి=ఉన్నాఁడు? గు॥యస్య=ఎవనికి పునః=తిరిగి నజన్మ=పు ట్టుకలేదో(వాఁడు) శి॥మృతః=చచ్చినవాఁడు కోవా=ఎవ్వఁడు?గు॥ యస్య= ఎవ్వనికి పునః=తిరిగి నమృత్యుః=మరణములేదో అనఁగా ఒకరిని యాచిం చుటచేత చులకఁదనము వచ్చుననియు, యాచింపక పోవుటవల్ల గొప్పతనము వచ్చుననియుజన్మలేకుండ చేసికొన్నవాఁడు క్రొత్తగ జన్మించినవాఁడనియు తిరిగి మరణములేనివాఁడు చచ్చిన వాఁడనియుఁ దాత్పర్యము.

ఇందు విశేష తాత్పర్యమేమనఁగా గురుకులవాసముచేసి సద్గురు కటాక్షముచేత తన పాపములనెల్ల నశింపచేసికొని బ్రహ్మసాక్షాత్కారము చేత తనయాత్మను మార్పునొందించుకొని మోక్షాధికారము పొందుటకు తన నుతగినవానినిగాచేసికొనుటయే క్రొత్తగా జన్మించుటయనియు అట్టి జన్మ ప్రాప్తికి తన్ను త్రిప్పుకొనుటకు చేసికొనుటయే మరణము నొందుటయని యు భావము. (అనగా బ్రహ్మజ్ఞాని కావలెనని ముఖ్యాంశము.)

గీ॥ యాచ్నచే వచ్చునదియేది యనఘ? లఘుత!
గొప్ప తనమెట్లువచ్చును? గోరకుంట
జాతుఁడెవ్వఁడు? జన్మకుఁ జననివాఁడు
మృతకుఁడెవ్వఁడు? మృత్యువు గతినిగనఁడో॥

18. What is the root of all humiliation ? To go a-begging for one's own self-gratification. And what commands respect of all ? Never to have the spirit of a beggar for anything whatever. Who can truly be called ' born ' ? He, who will meet with death no more.

శ్లో॥ మూకో స్తికో వాబధిరశ్చకో వా
యుక్తం నవక్తుం సమయే సమర్థః
తథ్యం సుపథ్యం నశృణోతి వాక్యం
విశ్వాస పాత్రం నకిమస్తి నారీ॥ 19.

అర్థము॥ శ్లో॥ మూకః=మూఁగవాఁడు కః అస్తి=ఎవఁడు ఉన్నాఁడు? బధిరశ్చ=చెవిటివాఁడును, కో వా=ఎవఁడు? గు॥ సమయే=సమయమందు యుక్తమ్=తగినట్లుగా వక్తుమ్=చెప్పుటకొఱకు నసమర్థ=శక్తిలేనివాఁడెవ్వఁడో (వాఁడు మూఁగవాఁడు.) తథ్యం=నిజమైనట్టియు సుపథ్యం=హితకరమైనట్టియు వాక్యం=మాటనునశృణోతి=వినఁడో (వాఁడు చెవిటివాఁడు) శ్లో॥ కిం=ఏది విశ్వాసపాత్రమ్=నమ్మికయుంచతగినది నాస్తి=కాదు? గు॥ నారీ=ఆఁడుది.

తా॥ సమయమువచ్చినపుడు యుక్తమైనది చెప్పనివాఁడు మూఁగవాఁడనియు, సత్యమైనట్టియు మేలుకలిగించునట్టియు మాటనువినని వాఁడు చెవిటివాఁడనియు, ఆఁడుది విశ్వసింపరానిదనియుఁ దాత్పర్యము.

గీ॥ మూఁగయెవ్వఁడు? బధిరుఁడు మొనసియెవఁడు?
యుక్తముగపల్కనేరక యున్నమూక
బధిరుఁడగు తథ్యమగు పల్కుపల్కలేఁడో
విశ్వసింపఁగరానిదో? వెలఁదియగును॥

19. Who can really be called deaf and dumb? He is dumb who cannot speak out the right things in right moments; and he is deaf indeed, who never hears a good advice. Who can seldom be relied upon? Woman.

శ్లో॥ తత్వంకిమేకం శివమద్వితీయం
కిముత్తమం సచ్చరితం యదస్తి
కింకర్మకృత్వా నచ శోచనీయం
కామారి కంసారి సమర్చనాఖ్యం॥ 20.

అర్థము గు॥ శి॥ ఏకం=ముఖ్యమైన తత్వమ్=తెలిసికోతగిన యథార్థ వస్తువు కిం=ఏది? గు॥ అద్వితీయం=రెండవది లేనటువంటి శివమ్=బ్రహ్మ సాక్షాత్కారత్వము. శి॥ ఉత్తమం=ఘనమైనది, కిం=ఏది? గు॥ యత్=ఏ సచ్చరితమ్=మంచిప్రవర్తన అస్తి=ఉన్నదో. (అదే) శి॥ కింకర్మ=ఏ పని కృత్వా=చేసి, నచశోచనీయమ్=దుంఖింపవలసినది లేదు? గు॥ కామారి కంసారి సమర్చనాఖ్యమ్; కామారి=శివునియొక్కయు, కంసారి=విష్ణువు యొక్కయు, సమర్చనా=మిక్కిలిపూజించుట యనే, ఆఖ్యమ్=పేరుగల కర్మను.

తా॥ సాటిలేని బ్రహ్మము నెఱుంగుటయే నిజమైనతత్వమనియు, సత్ప్రవర్తనమే మిక్కిలియుత్తమమైనదనియు, శివకేశవపూజ చేసినచో దుఃఖింపవలసిన యవసరములేదనియుఁ దాత్పర్యము.

గీ॥ తత్వమెయ్యదియగు? శివతత్వముకద
యుత్తమమొ?సచ్చరిత్రమె యొప్పు భువిని
ఎట్టిపనిచేయ దుఃఖము లెలమిరావు
హరిహరుల పూజచేసిన దరికిరావు॥

20. What is the Ultimate Truth? The fact of the existence of That, Which is all-good and One without a second. What is the noblest thing in this world? A pure spirit. What is that work, by whose performance one is

never brought to grief ? The worship of Him who is the enemy of lust (Shiva), and Him who killed Kamsa (Krishna, the incarnation of Vishnu).

---

శ్లో॥ శత్రోర్మహా శత్రు తమోస్తి కోవా
కామః సకోపా నృత లోభ తృష్ణః
నపూర్వ్యతే కో విషయైః సఏవ
కిం దుఃఖమూలం మమతాభిధానం॥ 21.

అర్థము॥ శ॥శత్రోః=శత్రువుని కంటెను, మహాశత్రుతమః=ప్రబల శత్రువు, కోవా=ఎవ్వఁడు, అస్తి=ఉన్నాఁడు గు॥ సకోపానృతలోభ తృష్ణ=కోపము, అబద్ధము, లోభము, ఆశ, వీనితోఁగూడిన కామః=విషయ వాంఛ. శ॥విషయైః=ప్రాపంచిక విషయముల చేత కః=ఎవ్వఁడు నపూర్యతే=నిండింపఁబడని వాఁడు? గు॥ సఏవ=కామాది విషయ వాంఛల చేత నిండింపఁబడనివాఁడె. శ॥దుఃఖమూలమ్=దుఃఖకారణమైనది కిం=ఏది? గు॥ మమతాభిధానమ్=మమకారమనే పేరు నొందినదె.

తా॥ గొప్ప శత్రువులు; కామము, అనృతము, లోభము, తృష్ణ, అనునవి యనియు, కామాదివికారములు లేనివాఁడు నిర్వికారుడనియు, మమకారమే దుఃఖమునకు కారణమనియుఁ, దాత్పర్యము.

గీ॥ శత్రులెవ్వరు? లోభంబు జగతి మీఁద
కామకోపానృతంబులు కడు దురాశ
విషయ పూరితుఁడెవ్వఁడు? విడనివాఁడె
దుఃఖమూలము మఱి యేది? తొడరి మమత॥

21. Which is the most formidable of all the enemies of man? It is the passion to possess, attended, as it always is, with anger, untruthfulness, and avarice and thirst for more. What is never appeased by gratification? The aforesaid passion indeed. What is the seed of all misery? The thought of 'I' and 'mine.'

---

శ్లో॥ కింమండనం సాక్షరతాముఖస్య
సత్యంచ కిం భూతహితం తదేవ
త్యాజ్యంసుఖమ్ కిం స్త్రియమేవసమ్యక్
దేయంపరం కిం త్వభయం సదైవ॥ 22.

అర్థము॥ శ॥ ముఖస్య=ముఖమునకు మండనం=అలంకారమైనది, కిం=ఏది? గు॥ సాక్షరతా=చదువువచ్చుటయే. శ॥ సత్యంచ=సత్యమైనది, కిం=ఏది? గు॥ భూతహితమ్=ప్రాణులకు మేలుకలిగించెడు, తదేవ=అయథార్థమే. శ॥ సమ్యక్=బాగుగా, త్యాజ్యం=విడచిపెట్టతగిన సుఖమ్=సుఖము కిమ్=ఏది? గు॥ స్త్రియమేవ= ఆడుదానినే. శ॥ పరం=మిక్కిలి, దేయం=ఇవ్వతగినది కింతు=ఏదియున్నది? గు॥ సదైవ= ఎల్లప్పుడు. అభయం=భయము నొందిన వానికి కాపాడుదునని అభయ మిచ్చుటయే॥

తా॥ చదువు ముఖమున కలంకారమనియు, ప్రాణులకుహితమును జేయుటయే సత్యవ్రతమనియు లెస్సగా స్త్రీసుఖమును విడువవలెననియు, ప్రాణులకెల్లప్పుడు అభయమిచ్చుచుండవలెననియుఁ దాత్పర్యము.

గీ॥ మోమునకు భూషణంబేది? మొనసి చదువె
భూమిలో సత్యమెయ్యది? భూతహితము

విడువ సుఖ మాయి యేదగు? వెలది సుఖ్మ
మేయు మెంట్టిది? యభయంబె దినదినంబు॥

22. What is the embellishment of face? Literacy. What is truth? That which is beneficial to all beings. What kind of happiness should be shunned? Sex-indulgence. What is the best thing to be given to all, at all times? Freedom from fear of all kinds.

---

శ్లో॥ కస్యాస్తి నాశే మనసోహి మోక్షః
క్వ సర్వథా నాస్తి భయం విముక్తౌ
శల్యం పరం కిం నిజమూర్ఖతైవ
కే కే హ్యుపాస్యా గురవశ్చ వృద్ధాః॥ 23.

అర్థము॥ క॥ కస్య=దేనియొక్క నాశేసతి=నాశనము కలుగుచుండగా, మోక్షః=ముక్తి అస్తి=కలదు? గు॥ మనసః=మనస్సుయొక్క, నాశేసతి=నశింపు కలుగుచుండగా ముక్తిః=మోక్షము అస్తి=కలదు. క॥ క్వ=యెక్కడ సర్వథా = ఎల్లయవస్థలయందు భయం=భయము నాస్తి=లేదు? గు॥ విముక్తౌ=విడుదలకలిగినప్పుడు (స్వరూపానుభవమునందు) భయంనాస్తి=భయములేదు. క॥ పరం=మిక్కిలి, శల్యం=కమ్ములో గుచ్చుకొనెడు యినుప ములికి కిం=ఏది? గు॥ నిజమూర్ఖతైవ=తనదియగు అజ్ఞానమే. క॥ కేకేహి=ఎవ్వరెవ్వరు, ఉపాస్యాః=సేవింప తగినవారు? గు॥ గురవశ్చ=గురువులున్ను, వృద్ధాశ్చ=పెద్దలున్ను.

తా॥ మనోనాశనమే మోక్ష మిచ్చుననియు, తన్ను తెలిసికొని విముక్తిని పొందిన యోధుల భయము లేదనియు అవిద్యయే హృదయ

శల్యమనియును గురువులను పెద్దలను సర్వదా సేవింప తగినవారినియును దాత్పర్యము.

గీ॥ ఏదినశియింప మోక్షము, నిచ్చు? మనసె
ఏదిశలిగిన భయముండ దెవుడు? భక్తి
భువిని శల్యంబొ? నిజముగా మోటుతనమె
కోరిపూజింపఁదగువారొ? గురులు బుధులు॥

23. At whose destruction comes the final liberation? Mind's. In which state there is no more fear? In the state of perfect emancipation on realisation. What is the keenest of all the darts (that pricks a man)? One's own ignorance. Who are the objects of respect? Those from whom we learn anything and the elders.

---

శ్లో॥ ఉపస్థితే ప్రాణహృతే కృతాంతే
కి మాశుకార్యం సుధియా ప్రయత్నాత్
వాక్కాయ చిత్తైః సుఖదం యమఘ్నం
మురారి పాదాంబుజ మేవ చిన్త్యమ్॥ 24.

అర్థము॥ శ॥ ప్రాణహృతే=ప్రాణములను హరించునట్టి, కృతాంతే=యముండు ఉపస్థితే= దగ్గిరకు ఐచ్చినవాఁడుకాగా సుధియా=మంచిబుద్ధి కలవానిచేత ప్రయత్నాత్ =మిక్కిలి యత్నమువలన కిం=ఏది ఆశు=శీఘ్రముగా, కార్యంచేయఁదగినది? గు॥ వాక్కాయ చిత్తైః=వాక్కుచేతను, శరీరముచేతను, మనస్సు చేతను, యమఘ్నం=యముని చంపునట్టియు, సుఖదం=సౌఖ్యమునిచ్చునట్టియు మురారిపాదాంబుజమేవ=విష్ణుమూర్తి పాదకమలములనే చిన్త్యమ్=తలంపవలసినది.

తా॥ ప్రాణములహరించెడు యముఁడు దగ్గిరకువచ్చినప్పుడు పండితునిచేత ప్రయత్నముచేత, మనోవాక్కాయములచేత, సౌఖ్యకరమైనట్టియు, మృత్యువునకుగూడ మృత్యువైన శ్రీమన్నారాయణమూర్తియొక్క పాదకమల ధ్యానము చేయవలసినదని తాత్పర్యము.

గీ॥ అంతకుఁడు ప్రాణహర్తయై యతిరయమున
వచ్చుతఱి యేమి సేయంగ వలయుసుమతి?
అంతకాంతకుఁడయి జగమంతయేలు
నల మురాంతకు పాదముల్ గొలువవలయు॥

24. What should be done by the thoughtful mind in all haste at the approach of the great destroyer, Death? Then, with all mind and speech one must meditate on the lotus-feet of Murari (Vishnu), the great saviour from its hand.

---

శ్లో॥ కేదస్యవః సన్తి కువాసనాఖ్యాః
కః శోభతే యః సదసి ప్రవిద్యః
మాతేవ కామో సుఖదా సువిద్యా
కిమేధతే దాన వశాత్సువిద్యా॥ 25.

అర్థము॥ శ॥ దస్యవః=దొంగలు కే=ఎవ్వరు సన్తి=ఉన్నారు? గు॥ కువాసనాఖ్యాః=కుత్సితమైన కామాది సత్కృచందన విషయ వాంఛలను పేరుకలవారె. శ॥ సదసి=సభయందు కః=ఎవ్వఁడు శోభతే=ప్రకాశించును? గు॥యః॥ =ఎవ్వఁడు ప్రవిద్యః=ఉత్కృష్టమైన వేదాన్తవిద్యకలవాఁడో (వాఁడు)॥ శ॥ మాతేవ=తల్లివలె యాకా=ఏది సుఖదా=సౌఖ్యము నిచ్చు

నది? గు॥ సువిద్యా=మంచి విద్యయె. శి॥ దాన వశాత్=ఒకరికిచ్చుటవలన కిం=ఏది ఏధతే=వృద్ధిని పొందును గు॥ సువిద్యా=మంచిచదువే.

తా॥ చెడ్డతలంపులే దొంగలనియు మంచి విద్య కలవాఁడె సభాలంకారుఁడనియుఁ దల్లివలె సుఖకరమైనది విద్యయనియు, ఇతరులకు నిచ్చుట చేత విద్య పెఱుగుననియుఁ దాత్పర్యము.

గీ॥ చోరు లెవ్వరు? విషయముల్ గోరువారే
వెలుఁగు నెవ్వఁడు సభయందు? విద్యయుతుఁడె
తల్లివలె నేది పోషించుఁ? దగినవిద్య
యిచ్చినఁ దఱుగకుండున దేది? విద్య॥

25. What like thieves (takes away the valuable possessions of one)? Evil propensities. Who graces an assembly? The learned. What brings happiness and solace in life? Learning. What augments by imparting to others? Learning.

---

శ్లో॥ కుతోహి భీతిః సతతం విధేయా
లోకాపవాదా ద్భవ కాననాశ్చ
కోవాస్తి బంధుః పితరౌచ కోవా
విపత్సహాయః పరిపాల కోయా॥26.

అర్థము॥ శి॥ సతతం=ఎల్లప్పుడు కుతోహి=దేనివల్లనుండి భీతిః=భయము విధేయా=చేయతగినది? గు॥ లోకాపవాదాత్=లోకనిందవల్లనుం డిన్ని భవకాననాశ్చ=సంసారమనెడు అడవివల్ల నుండిన్ని. శి॥ బంధుః= చుట్టము కోవాఅస్తి=ఎవ్వఁడున్నాఁడు? పితరౌచ=తల్లిదండ్రులున్ను

శో వా=ఎవ్వరు? గు॥విపత్సహాయః=ఆపదయందు సహాయపడినవాఁడు బంధువుఁడు, యః=ఎవరయితే పరిపాలకాః=రక్షించెడు వారో వారేతల్లిదండ్రులు

తా॥ ఎల్లప్పుడు లోకాపవాదము నుండియు, సంసారారణ్యము నుండియు, నెల్లప్పుడు భయపడ వలసినదనియు ఆపదలయందు సహాయ పడినవారె తల్లిదండ్రులనియుఁదాత్పర్యము.

గీ॥ దేనికిని భీతినొందుచుఁ దిరుగ వలయు?
నవని నపవాదమునకును భవవనికిని
బంధువెవ్వఁడు? విపదము బాపువాఁడు
పాలనము చేయు వారెపో పరమ పితలు॥

26. On what quarters ought we always to look with distrust and fear? On public opinion and the wild mazes of this forest-like world. Who is a friend and who can truly be called to be one's parents? He who helps one in times of adversity, is the friend, and those who help to maintain one are the parents.

---

శ్లో॥ బుధ్వానబోధ్యం పరిశిష్యతే కిం
శివ ప్రసాదం సుఖబోధరూపం
జ్ఞాతేతు కస్మిన్ విదితం జగత్ స్యాత్
సర్వాత్మకే బ్రహ్మణి పూర్ణరూపే॥ 27.

అర్థము॥ శి॥ బుధ్వా=తెలిసిన పిదప కిం=ఏది బోధ్యం=తెలిసికొనఁదగినదైన పరిశిష్యతే=మిగిలియుండదు? గు॥ సుఖబోధరూపం=సుఖముగాఁ తెలిసికొనఁదగినశివప్రసాదం=సచ్చిదానంద స్వరూపమును శి॥కస్మిన్ =

ఏది, జ్ఞాతేతు=తెలియఁబడినప్పుడు జగత్=లోకము విదితమ్=తెలియఁబడినది స్యాత్=అయ్యెనో? గు॥పూర్ణరూపే=అంతటను పరిపూర్ణమైనట్టియు, సర్వాత్మకే=అబ్రహ్మస్తంబ పర్యంతము బాహ్యాభ్యంతర స్వరూపమైన బ్రహ్మణి=సాక్షాత్కారము జ్ఞాతేసతి=తెలిసిన మీఁదట (ఇఁక తెలిసికో వలసినదిలేదు.)

తా॥ స్వప్రకాశమైన నిర్వికారాఖండ పరబ్రహ్మ సాక్షాత్కారమైన మీఁదట తెలియ వలసినదేదియు లేదని ముఖ్యార్థము. ఆబ్రహ్మస్తంబపర్యంతము, బాహ్యాభ్యంతరములయందు నిండి వెలుఁగొందుచున్న స్వప్రకాశ పరబ్రహ్మము సెఱిఁగిన యెడల జగత్తంతయుఁ దెలిసినదేయగునని తాత్పర్యము.

గీ॥ ఏది తెలిసిన మీఁదట నేది తెలియ
వలసియుండదు? శివతత్త్వమలవడినను
ఏది తెలిసిన జగమంత నెఱుఁగనగును?
సర్వమయమైన బ్రహ్మము సాధువుగను॥

27. What knowing, nought is left to be known any more? The Lord of the universe, who is all good, all peace and whose very Self is Absolute Bliss and Knowledge. By realising which the whole world stands realised? By the realisation of the absolute Brahman Who is the Self of all.

---

శ్లో॥ కిందుర్లభం సద్గురు రస్తి లోకే
సత్సంగతిఃబ్రహ్మ విచారణాచ
త్యాగోహి సర్వస్య శివాత్మబోధః
కోదుర్జయః సర్వజనైర్మనోజః॥ 28.

అర్థము॥ శ్లో॥ లోకే=జగమునందు దుర్లభం=పొందశక్యముకానిది కిమస్తి=ఏదియున్నది? గు॥ లోకే=లోకమందు సద్గురుః=భగవంతుని తెఱిఁగిన గురువున్ను, సత్సంగతిః=సజ్జన సహవాసమున్ను. బ్రహ్మ విచారణా చ= బ్రహ్మవిచారము చేయుటయు, సర్వస్య=అన్నిటియొక్క త్యాగోహి= సంగపరిత్యాగమున్ను, శివాత్మబోధః=బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమున్ను, (దుర్లభమైనది) శ్లో॥ సర్వజనైః=ఎల్లజనులచేత కః=ఎవ్వఁడు దుర్జయః= జయింప నలవికానివాఁడు. గు॥ మనోజః=మన్మథుఁడు,

తా॥ బ్రహ్మవేత్తయగు సద్గురువును సజ్జన సాంగత్యమున్ను పరబ్రహ్మ జిజ్ఞాసయున్ను, సర్వసంగపరిత్యాగమున్ను బ్రహ్మసాక్షాత్కారజ్ఞాన మున్ను, లోకమందు దుర్లభమైనవని తాత్పర్యము.

గీ॥ జగము నందున దుర్లభంబగున దెద్ది?
సజ్జనుల చెల్మి బహ్మ విచారణంబు
సద్గురుండును తత్త్వము సాధుమైత్రి
మనసిజుఁడె దుర్జయుఁడు సుమ్ము మనుజులకును॥

28. What are rarely to be found in this world? A spiritual guide, who has himself seen the Lord—the company of real sage—a mind really struggling to attain to the perfect realisation of the absolute and infinite Being, the Brahman—the renunciation of everything for the Lord and the realisation of the truth 'I am that Absolute Bliss' What every one finds very hard to vanquish? The sex idea and the attraction of the other sex.

శ్లో॥ పశోః పశుః కా నకరోతి ధర్మమ్
ప్రాధీత శాస్త్రోపి నచాత్మబోధః
కింతద్విషంభాతి సుధోపమం స్త్రీ
కేశత్రవో మిత్రవదాత్మజాద్యాః॥ 29.

అర్థము॥ శ॥ పశోః=జ్ఞానములేని పశువుకంటెను పశుః=పశువు, కః=
ఏది? గు॥ యః=ఎవ్వఁడు ధర్మమ్=ధర్మమును నకరోతి= చేయఁడో॥ (వా
డును) ప్రాధీతశాస్త్రోపి=చదువుకొనబడిన వేదవేదాంగాది విద్యలుకలవాఁడ
యినప్పటికి, నచాత్మబోధః=ఆత్మజ్ఞానము లేని వాఁడును॥ శ॥ కింతత్=
ఎది సుధోపమమ్= పైకి నమృతము వలెనున్నదియయి విషం=ప్రాణహాని
చేయుకాలకూట విషముగా భాతి=ప్రకాశించుచున్నది? గు॥ స్త్రీ=ఆడు
దియే. శ॥ మిత్రవత్ =పైకిమిత్రులవలెనుండు శత్రవః=పగవారు కే=ఎవ్వ
రు? గు॥ ఆత్మ జాద్యాః=పుత్రులు బంధువులు మొదలగువారు.

తాత్పర్యము॥ ధర్మము చేయనివాఁడును శాస్త్రములు చదువు
కొన్నను ఆత్మజ్ఞా ము లేనివాఁడును పశువుకంటె నధమమైన పశువనియును
పైకినమృతము వలెఁగనుపించినను స్త్రీవిషతుల్యమైన దనియును పైకిమిత్రులు
గాఁగనుపించినను పుత్రులు మొదలగువారే శత్రువులనియును దాత్పర్యము.

గీ॥ పశువునకు తుల్యుఁడో? ధర్మపరుఁడు కాని
వాఁడు నాత్మ నెఱుఁగని వాఁడె యగును
పైకి సుధ;లోన విష మేది? పడతిసుమ్ము
పైకిమిత్రులు, శత్రులో? భార్యసుతులు॥

29. Who is the most beastly among the beasts? One who does not practise what is right and virtuous (Dharma) and also he who is devoid of Self-Knowledge, even after

a thorough study of the Scriptures. What is the poison that seems sweet like nectar to taste? The wife of a man (for she stands on his way to attain to the realisation of the Lord with her so-called love). Who, though in friend's guise, are really one's foe? One's own offsprings and relations.

---

శ్లో॥ విద్యుచ్చలం కిం ధన యౌవనాయు
ర్దానం పరం కించ సుపాత్ర దత్తం
కంఠంగతైరప్యసుభి ర్నకార్యం
కిం కిం విధేయం మలినం శివార్చా॥ 30.

అర్థము॥ శి॥ విద్యుచ్చలమ్= మెఱుపువలెచంచలమైనది కిం=ఏది? గు॥ ధనయౌవనాయుః=ధనము, వయస్సు, ఆయుర్దాయము. శి॥ పరమ్=శ్రేష్ఠమైన దానమ్=దానము కించ=ఏదియున్నది? గు॥ సుపాత్రదత్తమ్=సత్పాత్రమందు నీయఁబడినటువంటిది. శి॥ అసుభిః=ప్రాణములు కంఠంగతైరపి= కంఠగతములై పోవుచున్నపుడును కిం=ఏది నకార్యం= చేయఁగూడదు? కిం=ఏది విధేయం=చేయవలసినది? గు॥ మలినం=పాపకార్యము. (చేయఁగూడదు.) శివార్చా=ఈశ్వరపూజ. (చేయవలసినది.)

తాత్పర్యము॥ ధనము యౌవనము ఆయుర్దాయము మెఱుపువలె క్షణికములనియు, యోగ్యునికి దానము చేయవలయుననియును, ప్రాణములు పోవుట తటస్థించినను పాపము చేయఁగూడదనియును ఈశ్వరారాధన సర్వదా చేయుచుండవలె ననియుఁ, దాత్పర్యము.

గీ॥ మెఱుపుసమమేమొ? ధనాయువుల్ మేటి వయసు
యోగ్యదానంబొ? సత్పాత్రనుంచి నదియు

కంఠగతమైన ప్రాణంబు, కల్మషంబు
చేయఁగారాదు, శివపూజ చేయవలయు॥

30. What are fleeting like lightnings? Wealth, youth and life. When becomes a gift most plausible? When it is made to a worthy recipient. Even with the last breath, what must not be done and what should be done? Dirty deeds and the worship of Shiva (the infinitely blissful Being)

---

శ్లో॥ కిం కర్మయ త్ప్రీతికరం మురారేః
క్వాస్థా నకార్యా సతతంభవాబ్ధౌ
అహర్నిశం కిం పరిచింతనీయం
సంసార మిథ్యా త్వ శివాత్మతత్వం॥ 31.

అర్థము॥ శి॥ మురారేః=విష్ణుమూర్తికి ప్రీతికరం=సంతోషకరమైన కర్మ=పని కిం=ఏది? గు॥యత్=ఏకర్మ, మురారేః=విష్ణుమూర్తికి ప్రీతికరం=సంతోషకరమైనదో (అదేకర్మ) శి॥ క్వ=ఎక్కడ ఆస్థా=ప్రయత్నపూర్వకమైన ఆశ, నకార్యా=చేయఁగూడదు. గు॥ సతతం=ఎల్లప్పుడు భవాబ్ధౌ=సంసార సముద్రమందు ఆస్థా=ఆశ నకార్యా=చేయఁగూడదు. శి॥ అహర్నిశమ్=దివారాత్రములు పరిచింతనీయం= ఆలోచింపవలసినది కిం= ఏది? గు॥ సంసార మిథ్యాత్వ శివాత్మతత్వమ్=సంసార మిథ్యాత్వ=సంసారము వట్టిదనియు, శివాత్మతత్వమ్=బ్రహ్మసత్యమైనదనియు (తలంపవలసినది)

తాత్పర్యము॥ మురారికి ప్రీతికరమైనదే కర్మయనియు, సంసారమందు ఆశ దిగనాడ వలయుననియు, దివారాత్రములు "జగన్మిథ్యాబ్రహ్మసత్యం" అని తలంపవలెననియుఁదాత్పర్యము.

గీ॥ ఏది సత్కర్మ? కంసారికేది ప్రియము
వాంఛపడరాదు భవ మహావార్ధియందు
చిన్త్యమేది? యహర్నిశల్ చేయవలయు
నంతయును మిధ్య శివతత్వమదియె నిజము॥

31. What work is pleasing to Him (Shiva) and therefore ought always to be performed in this world? The worship of Vishnu (the enemy of the demon Mura.) What is to be contemplated day and night? The non-reality of the world and the unity of the one's self with the Lord Who is Bliss Absolute.

---

శ్లో॥ కంఠంగతా వా శ్రవణం గతా వా
ప్రశ్నోత్తరాఖ్యా మణిరత్నమాలా
తనోతు మోదం విదుషాం ప్రయత్నాత్
రమేశ గారీశ కథేవ సద్యః॥ 32.

అర్థము॥ ప్రశ్నోత్తరాఖ్యా=ప్రశ్నలును ఉత్తరువులును కలిగియున్న మణిరత్నమాలా= ముప్పదిరెండు మణిశ్రేష్ఠములతో గూడిన జపమాల విదుషాం=పండితులయొక్క కంఠంగతా వా=కంఠమును ధరింపఁబడినను (చదివినను లేక) శ్రవణంగతా వా=చెవిని పొందినను(విన్నను) ప్రయత్నాత్ = యత్నము వలన (తప్పకుండగ) సద్యః=వెంటనే రమేశగారీశకథేవ= విష్ణ్వీశ్వరులకు చెందిన కథవలెనే మోదం=సంతోషమును తనోతు=చేయును.

తా॥ ప్రశ్నోత్తర సహితమైన యీ మణిరత్నమాల పండితులైన

వారు ప్రియత్నపడి చదివినను విన్నను శివకేశవుల చరిత్ర వలెనే యిది యును ఆనందమును కలిగించునని తాత్పర్యము.

గీ॥ ప్రశ్నలుత్తరములుగల్గి ప్రథితమైన
యిట్టి మణిరత్నమాలను నీ జగాన
చదివినను విన్న మోక్షంబు జనులకగును
నా రమేశ గౌరీశుల నధికకృపను॥

32. If memorised or heard with attention, this dialogue, known as "The wreath of gems," is sure to bring joy to the wise, for it proclaims directly the glories of Shiva and Vishnu.

---

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య వర్య శ్రీమచ్ఛంకరాచార్యవర్య విరచితా మణిరత్నమాలా సమాప్తా.

అర్థము॥ ఇతి=ఇది శ్రీపరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకరాచార్య వర్య విరచితా; శ్రీ=సంపత్కరమైనట్టి పరమహంస=కుటీచక, బహూదక, హంస, పరమ హంసలను, భేదముకల పరివ్రాజక=యతులకు, ఆచార్యవర్య=ఆచార్యులలో శ్రేష్ఠుఁడైన శ్రీమచ్ఛంకరాచార్యవర్య=పూజ్యులయిన శంకరాచార్య స్వాముల వారి చేత విరచితా=రచియింపఁబడిన, మణిరత్నమాలా=మణిరత్నమాల యనునది సమాప్తా=ముగిసినదాయెను.

తాత్పర్యము॥ శ్రీమత్పరమహంస సన్యాసుల కందఱకు మూల కారణుఁడైన శ్రీశంకరాచార్యులస్వాములవారి చేత రచింపఁబడిన మణిరత్నమాల సంపూర్ణమయ్యెను.

## గద్య.

ఇది శ్రీమహాపాదుకాంత దీక్షాసంపన్నులును, ఆగమశాస్త్ర నిపుణులును
నపర శివావతారులునగు వంగలేటి వేంకటశివయ్య శాస్త్రిల వారికి ప్రి
యశిష్యుఁడును, ఏ. ఈ. యల్. యమ్. గుంటూరు కాలేజీ
పండితుఁడగునోరి హనుమచ్ఛాస్త్రి చేఁ దెలుఁగున నెల్ల
సుబోధ మగునట్లురకు ప్రతి పదార్థ తాత్పర్య
పద్య సహితముగ వ్రాయఁబడెను.
ఓమ్ తత్సత్.





# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. | పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 3 | శెల | సెల | 20 | 20 | మృతా | మృతో |
| ,, | 22 | నరక | నరకః | 22 | 7 | మర్థ | మర్థః |
| 4 | 1 | తన్నుదా | తన్నుఁదా | ,, | 9 | నశ్రుతి, చెమిటి | నశ్రుణోతి, చెవిటి |
| 5 | 14 | నిదురితు | నిద్రితు | ,, | 10 | నమ్మిక | నమ్మక |
| 6 | 19 | యనియు, దా | యనియుఁదా | 23 | 5 | గు॥ | |
| 7 | 7 | ధాన | ధానః | 24 | 6 | నపూర్వ | నపూర్య |
| ,, | 16 | కోధా | క్రోధా | 26 | 16 | విముక్తా | విముక్తా |
| 10 | 7 | మోది | మేది | 28 | 16 | కామో | కాయా |
| ,, | 22 | సబ్జ | సజ్జ | 29 | 16 | వాశ్చ | వాచ్ఛ |
| 12 | 1 | భృతా | భృతామ్ | ,, | 17 | కోవా | కావా |
| ,, | 3 | ? | కోవా=ఏవడు | ,, | 21 | వాశ్చ | వాచ్ఛ |
| 14 | 14 | యం | యః | 30 | 1 | కోవా | కావా |
| 15 | 7 | దుఃఖే | దుఃఖీ | 31 | 3 | బాహో | బాహ్యో |
| ,, | 11 | సమస్తా | సమస్తాః | 32 | 6 | మైనది | మైనవి |
| 16 | 12 | నకార్య | నకార్యం | 33 | 1 | కా | కో |
| 17 | 9 | కావా | కోవా | 38 | 5 | నెల్ల | నెల్లరకు |
| 18 | 10 | సర్వై | సర్వైః | ,, | 6 | నట్లురకు | నట్లు |
| 19 | 3 | కానిదా | కానిదో | i | 17 | వారి | వారు |
| 20 | 10 | లత్వము | మత్వము | | | | |
| ,, | 19 | జతా | జాతో | | | | |

☞ 30 వ పేజి 5 వ పఙ్క్తి లో "వారెతల్లి" కి మారుగా "వాఁడె బంధువుఁడనియుఁ బరిపాలించినవారె తల్లి" యనియు, 32 వ పేజి 10 వ పఙ్క్తి లో "వనితాత్మ" కి మారుగా "వనియు విషయవాంఛ విడువక శక్యము కానిదనియుఁదాత్మ" యనియు దిద్దుకొని చదువవేఁడుచున్నాఁడను.

